# ప్రేమలీల

(సాంఘిక నాటకము.)



ర చ యి త లు

మామిడిపూడి రామకృష్ణయ్య

మోచర్ల రామకృష్ణయ్య

నె ల్లూ రు.

# FOREWORD

This short play was written about two years ago. It was intended for the screen and not so much for the stage. Some alterations have since been made so as to make it more suited for the stage. We realize that there is room for further improvements. But, for reasons which need not be mentioned here, we had to publish it in a hurry and as it is.

On account of the present conditions of the film industry, we could not carry out our original intentions, and the manuscript was lying idle, till an unexpected event happened.

The Andhra Sabha (Regd.) Nellore, revived its dramatic activity and was on the look-out for a social play. One of us who is a member of the Sabha mentioned this book and read it to the gathering. The members showed a keen desire to put it on boards. The cast was distributed and we had to make the necessary changes in the text. We did what we could within the very short time at our disposal and gave it the present shape. The play was successfully staged on 6-12-1942. Our heart-felt thanks are due to the Andhra Sabha and its various members and particularly to Messrs. M. S. Narasimha Rau and P. V. Krishnayya.

Nellore,
12-12-42.

AUTHORS.

# నాటక పాత్రములు.

## [పురుషులు]

1. ప్రభాకరరావు (ఒక పల్లెటూరు బ్రాహ్మణుడు)
2. మనోహరరావు ... (ప్రభాకరరావు కుమారుడు)
3. మాధవరావు ... (డాక్టరు)
4. రామయ్య ... (కరణం)
5. కేశవదాసు ... (యాత్రికుడు)
6. సుబ్బారావు (కాశీలో ఒక ధనికుడు)
7. కేశవరావు ... (వాలంటీరు)
8. లక్ష్మణరావు ... (కాలేజియూనియన్ సెక్రటరీ)

భిక్షుకులు - ప్రయాణీకులు - వాలంటీర్లు మున్నగువారు.

## [స్త్రీలు]

1. మాలతి ... (ప్రభాకరరావు కూతురు)
2. సీతమ్మ ... (మాధవరావు తల్లి)
3. ఇందిర ... (సుబ్బారావు కుమార్తె)
4. సుశీల ... (Nurse)
5. మిస్ కమలం ... (Lady Doctor)
6. రంగమ్మ ... (కరణం రామయ్య భార్య)

# ప్రేమలీల



## Scene 1

[Residence of Prabhakar, a middle-class house-holder in Bezwada. Evening—Malathi lights the lamp before the picture of Sree Gopalaswamy-హారతి and song—She brings హారతి to her father Prabhakar—He is much pleased.]

ప్ర—మాలతీ, మీ అమ్మచాలే వచ్చింది నీకు—యీకాలం పూజా పునస్కారాలు మగవాళ్లల్లో అంతరించి పోయినా ఆడవాళ్లల్లో నైనా నిలచి వుండటం చాలా సంతోషం.—

(He looks up at her face) మాలతీ.

మా—నాన్నా - అన్నయ్య యింకా రాలేదేం? మీతో యేమైనా చెప్పి వెళ్లాడా? నాకెలాగో వుంది నాన్నా.

ప్ర—యెందుకమ్మా - యేమీ ఫర్వాలేదు - యేదో మీటింగ్ వుంటుంది.

మా—మీటింగు లేమీ లేవని చెప్పాడు. హారతివేళకి తప్పకుండా వస్తా నన్నాడు.

ప్ర—ఎక్కడో చదువుకుందుకు వెళ్లుంటాడు. పరీక్షలు దగ్గర కొస్తున్నాయి కాదూ - నీవు యింట్లో కెళ్లి పనిచూచుకో తల్లి. [Malathi goes in.]

కాలమే మారిపోయింది, యీ కాలం పిల్లకాయల్ని పట్టే టట్టే కనబట్టం లేదు - యూనియన్లు, మీటింగులు, స్ట్రైకులు - ఇవి బలమై పోతున్నాయి - చదువు సన్నగిల్లుతూ వుంది.—అయినా మా మనోహరుడు అలాటి వాడు కాడు.

మా—(Coming out again) నాన్నా - వచ్చాడా? (Looking out into the street) అడుగో అన్నయ్యయింకెవ్వరితోనో వస్తున్నాడు.

ప్ర—(Sees his son and the group) వీడి వాలకం చూస్తే కొంపమీదికి యేదో తెచ్చిపెట్టినట్టే వుంది, మనోహరం-యెవర్రా వీరంతా?

(Manohar keeps quiet—Malathi looks sad)

లక్ష్మణరావు—నాపేరు లక్ష్మణరావండి - నేను కాలేజ్ యూనియన్ సెక్రటరీ నండి.

ప్ర—అయితే, మా కుర్రాణ్ణి మీ యూనియన్‌లో చేరమంటున్నారూ? వొద్దు వొద్దు - పరీక్షరోజులుకూడాను - మీరు ' మావాణ్ణి పాడుచేయకండి. (addressing Manohar) నాయనా, యింట్లోకెళ్లు, ఆలస్యమైందని మీ చెల్లి దిగులు పడుతూవుంది.

లక్ష్మ—అందుకాదండి - యీరోజేం—మా ప్రిన్సిపాలు - మీకుర్రవాడిమీద అపనింద మోపి—

ప్ర—యేమిటీ - యేంమోపి?

ల—అపనింద మోపి - అక్రమంగా - పరీక్షకుపోనివ్వకుండా-
డీటెయిన్ చేశాడండి. మీకుర్రాడి తప్పేమీ లేదు
సుమండి. (Prabhakar dumbfounded) ఈవిషయం
మీకు చెప్పి కుర్రాణ్ణి దిగెట్టి వెళ్లటానికి వచ్చామండి.

ప్ర—(Heart-broken) మనోహరా—నిజమేనా?

మ—నేనేమి చెయ్యలేదు నాన్నా.

ల—అతడేమీ చెయ్యలేదండి - యెవరో తెలుగు మాష్టర్ని
హేళనచేస్తే వీడిమీద పెట్టి—

ప్ర—యెన్ని పర్యాయములు చెప్పాను—యీ యూనియన్లు-
యీ గొడవలు మనకెందుకురా? అని—'యేమీ చేయ
లేదు' 'చేయలేదు' అంటావు వెధవా - యేమీ చేయక
పోతే నీమీదేం విరోధమా ఆ ప్రిన్సిపాలికి? నేను
యెన్నెన్నో అవస్థలుపడి - వీడికి చదువు చెప్పించి -
వీడేమో నన్నుద్ధరిస్తాడని——
(Turning to Manohar) గాడిదలా పెరిగి—ఛీ -
నీముఖం చూడకూడదు. నీవెవరో నాకు పరమశత్రువ్వి-
కొడుకువా - నీలాంటికొడుకు వుంటేయేం-చస్తేయేం.
(Turning to Lakshmana Row and others)
వెళ్లండవతలికి.

(Prabhakar goes out into the street. Malathi leads the down-cast Manohar into the house.)

---

## Scene 2

[Night. A room in Prabhakar's house—small lamp-Malathi and Manohar.]

మా—అన్నయ్యా, యేమిట్రా యిది? అన్నం తినకపోతే పోయ్యావు, యీ రొట్టెముక్కైనా తిందూ, నీ విలాగే కూచోనివుంటే, యేడుపొస్తుందిరా నాకు.

మ—నాన్న యేంజేస్తున్నాడే, చూడు.

మా—నాన్న పడుకున్నాడులే, యిప్పుడా పూసెందుకు? తిందూ, నామాట వినవూ.

మ—చెల్లీ, తిండిమీద మనసుపోవడం లేదే.

మా—అంతేకాదూ? నే నిల్లా యింత బ్రతిమాలుకుంటున్నా వినవూ మరి, మన అమ్మే వుంటే నీ విలా చేయగలవూ?

మ—అమ్మే వుంటే నామాట నమ్మే వుండేది.

మా—యేమిటూ నీమాట? నాతో చెప్పకూడదూ.

మ—చిట్టీ, నీకేమిటి తెలుస్తుందే?

మా—నాకేం చెప్పొద్దులే. అది పోనీగాని, యీరొట్టె ముక్క తిని పడుకో. యిలా యెంతసేపు కూర్చుంటావురా.

మ—సరే చెల్లీ—యేదే, యిలాగియ్.

[Malathi gives him the bread and spreads the bed for him. Manohar eats slowly and thinking with eyes fixed on her]

చెల్లీ, యిలారా, నాదగ్గర కూచో

(looks at her face)

అమ్మను చూచినట్టే వుంది - నిన్ను చూస్తే—చిట్టీ, యే మైనా నామీద నీకు కోపం వుందా - యెందుకైనా?

మా—అన్నయ్యా యేమిటి నీవనడం?

మ—చెల్లీ! ఒక్కమాట - యేమిజరిగినా సరే, నీవు మాత్రం నన్నుగురించి యేం అనుకోకేం!

మా—యెందుకురా అలా మాట్లాడుతున్నావ్—నేను అనుకోవడ మేమిటి? నిన్నుగురించి? యెప్పుడైనా అనుకున్నానా? కావలిస్తే ఒట్టు.

మ—ఒట్టు యెందుకే? చెల్లీ నేనొకమాట చెప్తాను, వింటావా?

మా—(Eagerly) తప్పకుండాను. యేమిటన్నయ్యా?

మ—నీవు వెంటనే వెళ్లి పడుకోవాలి.

మా—నీవోమరి?

మ—నేనుకూడాను.

[Both occupy their beds - Malathi falls asleep]

(Manohar gets up—walks to and fro)

నేను చదువు పూర్తిచేసుకొనిగాని మానాన్నను చూడకూడదు—చెల్లి—మంచి నిద్రలోవుంది - యిదే సమయం—

(Looks at the picture of Gopalaswamy
స్వామీ! దయచేసి అడ్డు తగులకు—చెల్లి - నన్ను క్షమించు—నాకోసం దిగులుపడకు—నీకేమీ భయం లేదు. నీగోపాలస్వామి నిన్ను తప్పకుండా కాపాడ గలడు.

(Looks at her, goes out, comes in again, sees his sister roll on her side in her sleep, takes a last look and hurriedly goes out.)

---

## Scene 8

[Madhava Row's House in a street in Guntur.
Enter Madhava Row and his mother Seethamma.]

సీతమ్మ—మాధవా, యీరోజు వుదయం-మన యింటికి వచ్చిన వాళ్లెవరో తెలుసా?

మాధ—యెవరు వాళ్లు?

సీ—డిప్టీకలెక్టరు నారాయణరావు, ఆయన భార్య - చాలా డబ్బుగలవాళ్లు - ఒక్కతే కుమార్తె వారికి.

మాధ—ఆడబ్బెలా వచ్చిందో యెఱుగుదూ?

సీ—యెలావచ్చినా డబ్బు డబ్బుకాదట్రా మరి?

మా—సరేలే అమ్మా, నాకెందుకుగాని వారిగొడవ...

సీ—అదేమిట్రా ఆలా అంటావు? మనతో సంబంధం చేదామని వాళ్లువచ్చినప్పుడు వాళ్లకేమైనా మాటచెప్పొద్దట్రా మరి?

మా—యేదో ఒకటి చెప్పి పంపెయరాదూ?

సీ—యేమిటూ్రి మాధవా, యెన్నాళ్లైనా యిలాగేనా? గొప్ప గొప్పసంబంధాలు యెన్నొచ్చినా యిలాగే మాట్లాడి తప్పుకుంటున్నావు. నీకిస్తానన్న పిల్లలకందరికీ పెండ్లింద్లై కొందరు బిడ్డతల్లులుగా కూడా వున్నారు. నీవుమాత్రం యిలాగే వున్నావు. ఇన్నాళ్లు అంటే చదువు కాలేదనీ-అలాగనీ - ఇలాగనీ సమాధానాలు చెప్పేవు. ఇప్పుడేం చెప్తావు?చదువుకూడా పూర్తైందికదా!ఇప్పుడైనా పెండ్లి చేసుకోకపోతే - యెప్పుడురా?

[వీధిలోనుండి "మధూ—యెంతసేపు-Car off చేయనా."—అని ధ్వని.]

మా—కమింగ్ కమలం - వణ్ మినిట్-అమ్మా - యిప్పుడే వస్తా. [Exit.]

సీ—[Looking through the side - curtain]— యీ కాలం పిల్లలికి సిగ్గనేమాటే లేదు.—యెలా మారి పోయింది కాలం!

(Re-enter Madhav)

మాధవా, ఇంటి కెవరైనా వచ్చినప్పుడుకూడాను.— యీ రెణ్ణాళ్లైనా దాన్ని రావద్దని చెప్పకూడదటూ్రి.

మా—యెవరినమ్మా?

సీ—యెవరి నేమిటి? ఆ గంగమ్మని.

మా—గంగమ్మేమిటమ్మా? ఆమెపేరు కమలం - నోరుతిరగని పేరా? మన సుబ్బయ్యశాస్త్రిగారి కుమార్తెగాదూ?

సీ—దానిపేరూ - దానిపురాణం నాకెందుకుగాని - ఆవొచ్చివుండే పెద్దమనుష్యులకు యేదో వొకటి చెప్పక తప్పదుకదా - యేంచెప్పమన్నావు?

మా—మాటిమాటికి యెందుకమ్మా - నన్నడగటం - బోధపడలేదూ - నామనస్సు నీకు?

సీ—పోనీగానీ - మాధవా - ఒకమాటడుగుతాను చెప్పు-నీకు కోపం వచ్చేలాగుంటే అడగను సుమా!

మా—కోప మెందుకు? అడుగు.

సీ—మరేమీ అనుకోకేం! ఆ కమలంమీదనే యిష్టంవుంటే—దాన్నే...

మా—శివశివ - ఇప్పుడు బోధపడ్డది నాకు - అందుకా నీవామెను 'గంగమ్మ' అన్నావు?

సీ—అలా యేదైనా వుంటే - పోనీ దాన్నే చేసుకుందుగాని-నీ వెలాగో ఓలాగు పెండ్లి చేసుకొని - ఒక యింటివాడవైతే అదే చాలు-

మా—అమ్మా, యెంత పొరపాటుపడ్డావు - అయినా తప్పు నీదని అనడానికి వీలులేదు. మనసంఘంలో యిలాటి దురభిప్రాయాలకు చాలా అవకాశముంది. మా ప్రవర్తనలో నీకు చెప్పక దాచుకోతగ్గది ఏమీ లేదు. మానవకోటికి సేవచేయడమే జీవితపరమార్థంగా పెట్టు

కొని, కొన్ని చికిత్సాలయాలను సేవాసదనాలను కొందరు మహనీయుల ప్రోత్సాహంతో స్థాపించి యున్నాము; ఒక సేవాసమితికి కమలమూ, నేనూ జాయింట్ సెక్రటరీలుగా వుంటున్నాము. మద్రాసులో నర్సింగుహోమ్‌కూడా స్థాపించదలచుకున్నాము. అందు చేత తఱుచుగా కలుస్తూ వుంటున్నాముగాని మరేమీ లేదమ్మా.

సీ—అయితే పెండ్లిమాటేమిటూ?

మా—ఇప్పుడేం తొందర - ముసలివాణ్ణైనానా?

['మాధవరావ్'—A call]

అమ్మా—వస్తా. (Madhav Exit.)

(Curtain.)

---

## Scene 4

(Simhachalam—Dharmasala)

[Byragis—Travellers—Some will be sleeping. Others will be spreading their beds.]

ఒకడు—యేమయ్యా - కాళ్లు పైనవేసి తంతున్నావు?

మఱియొకడు—దూరంగాదా పండుకోమీ! చోటూ లేకుండా వుంది?

మూడవవాడు—యేదో పొరబాటు - క్షమించు - నిద్రలో-

మొదటివాడు—కాళ్లతో తన్నటం - క్షమించు అనటం - యెక్కడ నేర్చుకున్నా వీ తీర్పు?

[Enter Manohar]

మనో—యెన్నిచోట్ల ప్రయత్నించినా నిద్రపట్టడం లేదు. నిర్భాగ్యదామోదర్లను నిద్రాదేవత వరిస్తుందంటారు గదా—అదే నిజమైతే, నాకేల నిద్రపట్టదూ? వేకువ కూడా కావచ్చింది - మరి నిద్రేమిటి, భగవధ్యాన మైనా చేదాం!

## Song

(Raghavadas-An old Sadhu sleeping under a blanket wakes up.)

రాఘవదాసు—నిద్రాభంగమైనా - మధురకంఠం - యీ కుర్రాడివైఖరి చూస్తే - మంచి వంశానికి చెందినవాడి లా వున్నాడు. కూడా యెవరూ లేరు. పలకరించి చూస్తా-అబ్బాయి! యేవూరు నీది?

మనో—బెజవాడ.

రా—యెక్కడికి వచ్చావ్?

మ—యిక్కడికే.

రా—అది తెలుస్తూనే వుంది - యెక్కడికి ప్రయాణం?

మ—రేప్పొద్దున కొండెక్కి సింహాచలస్వామిని సేవించు కుందామని సంకల్పం.

రా—మీ అమ్మ - నాయనా వున్నారా?

మ—మా అమ్మ లేదు. నిరుటి భోగిపండుగనాడు అకస్మాత్తుగా చనిపోయింది.

రా—యిల్లా వంటరిగా వచ్చేశా వేం?

మ—యేమీ లేదు. బుద్ధిపుట్టింది - వచ్చేశాను - దేవుడి దర్శనానికి.

రా—చాలా గడుసువాడివిలా వున్నావే! అప్పుడే యింత వేదాంతం ముదిరిందా నీకు? మీవాళ్లకు తంతి యిప్పించమంటావా?

మ—వద్దు - వద్దు - ఇంట్లో జగడంవేసి రాలేదు నేను.— మీ రెందాకా ప్రయాణం?

రా—బదరీనారాయణం - యీ లోపల అన్ని పుణ్యక్షేత్రాలు సేవించుకోవాలి. అబ్బాయి! యెందుకోగాని నిన్ను చూచినప్పటినుండి నావెంట తీసికెళ్లాలని కోరిక కలిగింది - వస్తావా - నావెంట?

మ—అవశ్యం - యేబండికి బయల్దేరుదాం?

రా—అన్ని బండ్లు మనవే - యీ రోజున కొండెక్కి రేపు బయలుదేరుదాం.

మ—చిత్తం.

రా—కానీ మఱి—జాగ్రత్తగా పట్టుకో (Referring to the things which he put on Manohar's shoulders)

(Curtain.)

---

## Scene 5

[Prabhakar and Malathi—Passing along to their Native village.]

ప్రభా—మన గ్రామానికే వెళ్లివుంటాడని నీకు నమ్మకమేనా అమ్మాయ్?

మా—నమ్మకమే నాన్నా—వాడికి మరేవూళ్లూ తెలియవుగా-
మన వూళ్లో తప్పక వుంటాడు - కానీ నాన్నా - అన్న
య్యను మీరేమీ అనకండి.

ప్రభా—యెందుకంటానమ్మా - వాడు కనబడితే చాలు -
యింతటికీ తప్పు నాదే! అందరూ అన్నారుగా వాడేం
నేరం చేయలేదనీ—విన్నానా - ఓర్పులేక పోయింది -
వాడిమనస్సు యెంత నొచ్చిందో! యిన్నాళ్లయింది -
ఎక్కడ అవస్థపడుతున్నాడో.

మా—కరణం రామయ్యగారి యింట్లోనే వుంటాడు -
నాన్నా-మరేమీ దిగులు పడకండి.

(They pass on to Karnam Ramayya's house)

రామయ్య—యెన్నాళ్ల కెన్నాళ్లకు - ప్రభాకరం—దారి
తప్పివచ్చినట్లుందే - అమ్మాయ్ - లోపలి కెళ్లు - యే
మేయ్ - అమ్మాయిని తీసుకుపో - (Malathi goes in)
(Looking at Prabhakar) యేమిటోయ్ ప్రభాకరం -
అలా వున్నావ్?

ప్ర—రామయ్యా - మా మనోహరం - యేడీ?

రా—యెవరు?

ప్ర—మా అబ్బాయి - మామనోహరం - రాలేదూ యిక్క
డికి? యెక్కడ దాచావు - చెప్పూదూ - నీకు పుణ్యం
వుంటుంది.

రా—నీకేం వెర్రెత్తిందా యేమిటి?

ప్ర—నిజంగా వెర్రే యెత్తింది రామయ్యా. వారంరోజుల యింది నూతులూ - గోతులూ వెతికించాను. యెక్కడా పత్తా దొరకలేదు.

రా—యెక్కడికి వెళ్ళాడు?

ప్ర—నిజం చెప్పవూ - నేను మరెప్పుడూ అలా చెయ్యను. యేదో పొరపాటుపడ్డాను రామయ్యా! వాణ్ణి అన కూడని మాటలు అన్నాను.

రా—యేదో రెండురోజుల్లో తిరిగి రాడూ?

ప్ర—లేదు రామయ్యా, వస్తే యిక్కడికే రావాలి - యిక్కడ వుంటాడని కొండంత ఆశతో వచ్చాను. అదికూడా అడుగంటిపోయింది. వాడు నాకు మళ్లీ దక్కుతాడా?

రా—ప్రభాకరం, దుఃఖపడకు - యేం పర్వాలేదు.

ప్ర—రామయ్యా, ఇంకేముంది - చాలా గందరగోళంలో వున్నాను - నన్ను ఉద్ధరిస్తాడని అనుకున్నాను - నా చేతులారా పంపించేశాను. ఇక వాణ్ణి వెతకటం తప్ప నాకేమీ పనిలేదు - నేను తిరిగీ వచ్చేదాకా మా మాలతిని మీ యింట్లో వుంచుకుంటావా?

రా—నాకేమీ అభ్యంతరం లేదు.-కానీ—

ప్ర—అనుమానించకు రామయ్యా - నీ భూమిప్రక్కన్నే నాకుండే యకరా భూమిని నీకిచ్చేస్తా. మనకు చిన్న ప్పట్నుంచి వుంటూవుండే స్నేహాన్ని - యిప్పటి నా కష్టాన్ని - గమనించి నాకీపాటి సహాయం చేయలేవూ? యేం, రామయ్యా! 'సరే' అనరాదూ?

రా—అదికాదు ప్రభాకరం, భూమిమీ గిమీ సరే కాని—

ప్ర—దాన్ని విక్రయించమని యెన్నిమార్లో నీవే అడిగావుగా- అలాటిదాన్ని నేనుగా యిస్తున్నాను. యింకా ఆలోచ నెందుకు రామయ్యా?

రా—ఆలోచనకాదు గాని - మా ఆవిడతో మాట్లాడి చెప్తా నుండు - యేమేయ్ - నిన్నే - పలకవేం - యిలారా.

(Rangamma - from inside) యెందుకండీ, అలా కేక లెయ్యడం? యేం కొంప మునిగింది?

[Rangamma enters—Sees Prabhakar - adjusts her saree and lowers her tone]

రామ—ఆ యెకరా పొలం వుందే - ఇస్తా నంటున్నాడు ప్రభాకరం-

రంగమ్మ—ఇస్తే ఖండింపు చేసుకోకూడదూ - నన్నెందుకు పిల వడం?

రా—ఖరీదుకు కాదు. ఒకమాటడుగుతున్నాడు. యేమిటంటే- కొడుకును వెదకడానికి వెళ్లుతున్నాను - తిరిగి వచ్చిం దాకా - మా అమ్మాయిని మీ యింట్లో వుంచుకోండి అని అంటున్నాడు.

రంగమ్మ—యేమిటీ? యిలారండి! [Husband and wife move to one corner] యేమిటి మీ బేరమూ-మీ రూనూ? - బాగానే వుంది. కొడుకును వెతకడమూ సరే, మాలతిని యిక్కడవుంచిపోవడమూనూ సరే!

మీ కేమన్నా మతిపోయిందా యేమిటి? సంగతంతా విన్నాంగా - అలా పారిపోయిన కుర్రాడు యీ జన్మంలో కనిపిస్తాడా? ఆ పిల్లని మన యింట్లో వుంచుకోవడ మేమిటి? మొగాడైనా అయితే సరే కాని యెదిగే ఆడపిల్లను - పరాయిబిడ్డను. -యెన్నాళ్లు భరించగలం? మీ కేమన్నా పిచ్చా చాదస్తమా—కొంచెమైనా ముందు వెనుక ఆలోచన వుండొద్దూ-

రా—నేనుమాత్రం 'సరే' అన్నానటే - నిన్నడిగి చెప్తా నన్నానుగా!

రం—యెంతమాత్రం వీలుపడదు - నన్నడిగేదేమిటి?

(Exit Rangamma)

రా—(Coming over to Prabhakar) ప్రభాకరం, యేమీ లాభంలేదు. నేను యెంతో చెప్పాను.

ప్ర—రామయ్యా, మనపాతస్నేహానికి యెంతమార్పుకలిగిందోయ్.

రా—ఏంచెయ్యమంటావు?

ప్ర—పోనీగాని - ఒకమాట - చేస్తావా - అమ్మాయిని వెంట బెట్టుకొని వెళ్తానుగాని - యీ వెతకడం యెన్నాళ్లవుతుందో - ప్రయాణానికి పైకంకావలసివుంది - మా యింటిని భూమిని నీవు ఖరీదుకు పుచ్చుకొంటావా?

రా—దానికేంరా - అలాగే కాని - యెంతకిస్తావు?

ప్ర—ఆపదలో ఉన్నాను, అయిదువందలిచ్చేశెయ్-చాలు.

రా—(Keeping mum-Contemplating)

ప్ర—ఒకప్పుడు భూమిమాత్రం 600 కు అడిగావ్ - జ్ఞాపకం వుందా?

రా—కాలం మారిపోయింది ప్రభాకరం - ఇప్పుడు భూమీ అంటూ అడిగేవాడేలేడు - ఇల్లు యెందుకైనా పని కొస్తుందా? పశువులు కట్టేసుకునేటందుకు తప్ప - నీవేచెప్పు-

ప్ర—యేమిస్తావుమరీ?

రా—పైకానికి చాలా కసాలాగావుంది. అయినా నీవు అడిగావని - నీమాట తోసేసుకోలేక—

ప్ర—యేదో తేలుస్తూ.

రా—రెండు వందలైతే.

ప్ర—రెంటికీ రెండువందలా—రామయ్యా, దొంగసొమ్మటోయ్ నీగుణం చూపించావుగదరా.

రా—నీకంత ఆయాసమెందుకు - మరోవంద వేసుకో - సరేనా?

ప్ర—అలాగే.

రా—రిజిస్టరుకు రేపు వెడదామా?

ప్ర—మళ్లీ తిపిరీ పెట్టవుగదా?

రా—అన్నమాట యెప్పుడైనా తప్పానటోయ్-మరి - లే - భోజనానికి.

(Curtain)



## Scene 6

[Manohar and Raghavadas going along the banks of the Ganges at Benares—Raghavadas going ahead—Manohar following behind]

రాఘవదాసు—ఇదేనోయ్ - పరమపవిత్రమైన గంగానది—
యిలాటినది భూలోకంలో మరెక్కడా లేదు - మరే
లోకంలోనూ వుంటుందని నాకుతోచదు—

(Mean-while Manohar hears a cry of distress and runs while Raghavadas moves a few steps saying about the greatness of the Ganges without noticing the departure of Manohar.)

యీగంగలో, హిమవత్పర్వతపు ఓషధులు—

[He turns and finds Manohar missing, retraces a few steps. Manohar comes back with wet clothes. Raghavadas understands Manohar rescued somebody.]

యెంత సాహసం! యెంత సాహసం! నాయనా—
నాతో చెప్పకుండా చెయ్యకుండా - ప్రాణానికి
తెగించి—యిలారా,—యీపొడిగుడ్డ కట్టుకో - యీ
శాలువ కప్పుకొని కొంచెం యిలా కూర్చుందాం రా.

(Hands over dry clothes to Manohar-
Manohar goes in and re-enters with dry clothes
Both take their seats)

యెవరు నాయనా?

మ—ఒక చిన్నపిల్ల - పాపం - జారిపడి—బుటకలు వేస్తూ వుంది, మూడో బుటక్కి అందుకున్నా.

రాఘు—అక్కడి గుంపంతా చూస్తూ పూరుకున్నారా?

మ—సిగండి - మునగండి - అని కేకలు వేశారు.

రా—బాబూ - చిన్నవాడివైనా ధైర్యం చూపించావు. నిన్ను కన్నతలిదండ్రులు ధన్యులైనారు.

(Subba Row runs up to the spot and embraces Manohar)

సుబ్బారావు—బాబూ - నీబుణం యీజన్మంలో కాదుగదా - వేయిజన్మాలకైనా తీర్చుకోలేము - (Turning to Raghavadas) స్వామీ మీకుర్రవాడు యీరోజున నాకుమాత్రె ప్రాణమేకాదు . మాఅందరి ప్రాణాలు కాపాడేడు.

రాఘు—అంతా విశ్వేశ్వరునిదయ - యీరోజు కాశీవిశ్వనాధునకు అభిషేకం చేయించండి.

సుబ్బా—అలాగే - మీరు మాయింటిదాకావచ్చి మా ఆతిథ్యం స్వీకరించమని ప్రార్థిస్తూవున్నాను.

రా—అలాగే—

(All proceed towards Subba Row's house.)

(Curtain.)

---

## Scene 6 (a)

[Subba Row's House in Benares.]

సుబ్బా—స్వామీ దయచేయండి - అబ్బాయి - కూర్చోనాయనా- (They are seated)

బాబూ - మీది యేపూరండి?

రాఘు—మాది గోదావరీతీరం - ధవళేశ్వరం - యీఅబ్బాయి కృష్ణాతీరంనుంచి వస్తున్నాడు. నాకు దారిలో తోడైనాడు - దైవయోగంవల్ల చదువుకు అభ్యంతరం కలిగింది పాపం - చదువుకోవలెనని చాలాకుతూహలంగా ఉన్నాడు.

సుబ్బా—అబ్బాయీ, మాయింట్లోవుండి చదువుకోకూడదూ? యీ అబ్బాయిని చూస్తే పండ్రెండేండ్లనాడు పోయిన నాకుమారుడు మరల బ్రతికివచ్చినట్లు అనిపిస్తున్నది—

రాఘు—అబ్బాయి - నీకు మంచి ఆశ్రయమే చూపించాడు సర్వేశ్వరుడు, సుబ్బారావుగారు చాలా గొప్పవారు.

సుబ్బా—స్వామీ నాపేరు మీకెలా తెలుసు?

రాఘు—మీపేరు తెలియని యాత్రికుడున్నాడా? యీ రోజు చాలా సుదినం - మీబోటి ధనికులు యీలాటి కుర్రాళ్లకు చేసే సహాయం యెంత ఫలమిస్తుందో మీకు నేను చెప్పనక్కర్లేదు.—అబ్బాయి - నా హృదయభారంతీరింది. నీవు నీ గౌరవాన్ని వీరి గౌరవాన్ని కాపాడుతూ జాగ్రత్తగా మెలగుతూ వుండు, సుబ్బారావుగారూ - సెలవు.

సుబ్బా—యీ పూటైనా మా ఆతిథ్యం స్వీకరించండి.

రాఘువ—క్షమించండి.

(Manohar prostrates before Raghavadas)

సుబ్బా—అమ్మాయ్ ఇందిరా! - స్వాములవారికి నమస్కారం చేయి—

(Subba Row's daughter Indira enters and does so).

రాఘు—కల్యాణ మస్తు—

(Curtain.)

---

## Scene 7

[Doctor Madhava Row's Nursing Home at Madras. Kamalam in a chair reading a book-Looks at her wrist watch, peeps out and is generally fidgetty—She sits again and takes up the book—Keeps it by—She goes to the radio and is about to switch it on—Enter, Nurse Susila.]

సుశీల—కమలమ్మగారూ! డాక్టరుగారు వచ్చారా! ఆర్ఫనేజ్‌లో కుఱ్ఱాడికి టెంపరేచర్ ఎక్కువైందట - వేగిరం రమ్మని కబురు వచ్చింది.

కమలం—అలాగా! (Writes a prescription) సుశీలా, mixture తయారుచేసి వెంటనే నీవు తీసికెళ్లి అక్కడే ఉండు - వచ్చేస్తాను.

[Enter Madhava Row tired—Sits in the chair.]

కమలం—మధూ - యేమిటింత ఆలస్యం - నేనుకూడా వస్తానంటే అక్కరలేదు. అక్కరలేదు అన్నావ్ - యెలా వున్నారు పాపం?

మాధ—యెలా వున్నా రేమిటి? తలుచుకుంటే గుండె నీరై పోతూవుంది - యీపాడులోకంలో యెంత misery— యెంత బాధ - యెంత దరిద్రం - కమలం! దీన్నంతా ఆ దేవుడే సృష్టించివుంటాడా? యింతకంటే పని దొరక లేదా ఆమహానుభావుడికి?

కమ—భగవంతుడి లీల అన్నారుగా!

మా—యెంత దేవుడైతేమాత్రం, యీ అడుసులోనూ యీ మురికిలోనూ ఆడుకోవాలీ?

కమ—గొప్పవాళ్లని గురించి అలా చులకనగా మాట్లాడకూడ దోయ్! ముందు వెనక ఆలోచించేవాళ్లు వాళ్లని గురించి అట్టే మాటాడరు.

మాధ—ముందేమిటి, వెనకేమిటి? అంతా అలాగే వుంది. యీరోజు మరీని, దేవుడంటే మంటేస్తూ వుంది

కమ—మా వూర్లో ఒకాయన 'దేవుడు లేడు' - అంటే వుడికి పొయ్యేవాడు - యీ వుడుకులకు - మంటలకూ యేం. గాని, సంగతేమిటో చెబ్దూ?

మాధ—యేమిటుంది - Hell!—యెందుకులే!

కమ—పొద్దయింది. వేగిరం. orphanage కి వెళ్లి ఆకుర్రాణ్ణి. చూద్దాం పద.

(Exit—Curtain)

## Scene 8

[Prabhakar and Malathi walking along the road. Enter beggars singing]

ప్రభా—(Looking up fixedly) మాలతీ, చూడు! జాగ్రత్తగా - నీవి లేతకండ్లు. నా కండ్లను నేను నమ్మలేకుండా వున్నాను. ఆ కుడిచేతిపక్కనుంచి రెండో వాడు - మీ అన్నయ్యకాదూ?

(ఆవేగముతో) అబ్బాయ్ - యిలారా!

Head of the Party—యెవరయ్యా నీవు - ఆకుర్రోడితో నీ కేంపనీ?

ప్రభా—మనోహారం - నాయనా - క్షమించవూ - మఱచి పోయావా మమ్మల్ని - అమ్మాయ్! నీవు పిలవ్వే - 'అన్నయ్యా, అని - నీమాటంటే వచ్చేస్తాడు.

H—వెర్రి బామ్మడిలాగున్నావు - యేంటి నీవు మాట్లాట్టం?

ప్ర—బాబూ కోప్పడకు - ఆకుర్రా డెక్కడ దొరికాడు మీకు?

H—దొరకడ మేమిటి? వాడు నాకొడుకు కాదూ!

మాలతి—నాన్నగారూ - యిలారండి...

ఆకుర్రాడు మా అన్నయ్య కాడు. మా అన్నయ్య - మూడేండ్లయిందిగా - యిప్పటికి చాలా పెద్దవాడై యుంటాడు.

ప్ర—యెంత వెఱ్ఱివాణ్ణి - బాబూ క్షమించు. భ్రమపడ్డాను—
పోనీ. ఆ అబ్బాయిని ఒక్కమారు ఇలా రమ్మను.

(The boy comes to him)

ఒక్కపాట పాడతావా - మా మనోహరం కూడా పాటపాడేవాడు.

(The boy sings.)

(Prabhakar sheds tears) అమ్మాయ్. వాళ్లకి ఒక్క రూపాయియ్. [Malathi gives—They take leave.]

ప్ర—ఎంత భ్రమ కలిగింది!

(Curtain)

---

## Scene 9

[Manohar in his room with a Picture sketch in hand in Subba Row's house in Benares]

మనోహరుడు—చెల్లీ, నవ్వవూ, (Takes a brush and touches the face—Looks at it again)—యేదీ నీ చిఱునవ్వు? ఊఁహూ... యేమీ లాభం లేదు. యిలాగే వున్నావా యేమిటి?—నాన్నా!!—(Looks at the sketch) యెందుకమ్మా! నాకోసం బెంగపెట్టుకున్నావా చెల్లీ, యేడవకే! (Tears drop on the sketch)

[Enter Indira singing a tune which she stops abruptly as she sees Manohar lost in contemplation

over the sketch—she approaches him slowly and pats him on the back.]

ఇం—మామయ్యా!

మ—(Wakes up from his dream, hurriedly tries to conceal the sketch) ఇందిరా, యెంతసేపైంది నీవొచ్చి?

ఇం—యిప్పుడే.

మ—యేదీ, నీ నోటుబుక్కు యిలా తీసుకురా, యెన్ని లెఖలు వేశావు?

ఇం—మామయ్యా, అదేమిటి - యిలాగియ్-(Pointing to the sketch)

మ—యేమీ లేదు.

ఇం—(Gets hold of the sketch and sees it) యెవ రీవిడ? (She blots the tears on it with her saree). మామయ్యా, యెందు కిలా దుఃఖపడుతున్నావ్. యీ విడెవరు చెప్పవూ?

మ—(Wiping his tears) యెవరూ కాదు—ఉత్తచిత్తరువు-పొద్దుబోక—

ఇం—యెంత అందంగా వుంది- యెక్కడ చూశావు-చెప్పవూ.

మ—ఇందిరా?

ఇం—వుండు మామయ్యా - అమ్మకు చూపించి వస్తా.

మ—ఇందిరా, నీకు పుణ్యం ఉంటుంది - ఆ పని మాత్రం చెయ్యకు.

ఇం—ఈ విడెవరో చెప్పు మరి?

మ—చిన్నప్పుడు నాతో ఆడుకుంటూ వుండేది ఇందిరా.

ఇం—అలాగా? - నా బొమ్మకూడా వ్రాస్తావా?

మ—అలాగే—ఈ రోజు పాఠం కానీ మరి?

ఇం—(Taking up the Telugu Text)

"వేయికన్నులవేల్పుతో విగ్రహించి
వనిత, యింకేమి కానున్నవాడో మరుడు"...

మామయ్యా, దేవేంద్రుడికి వేయి కండ్లా? అబ్బ! తలకు రెండేసి కండ్లవంతున అయిదువందల తలకాయలన్న మాట.ఆయన,చూట్టానికి భయంకరంగా ఉండదూ?

మ—ఆయన చాలా అందగాడు - ముప్పయి మూడుకోట్ల దేవతలకి ఆయన ప్రభువు—విన్నావా?

ఇం—ఆయనదేనా, నందనోద్యానం అనేది?

మ—అవును.

ఇం—యెలా వుంటుం దావనం?

మ—చాలా మనోహరంగా ఉంటుంది.

ఇం—(Mischievously) యెలా వుంటుంది?

మ—మనోహరంగా.

ఇం—"మనోహరం" "మనోహరం" (Looking at him)

మ—(Feeling uncomfortable) - చదువు అవతల - రెండు రోజులనుంచీ పాఠం జరగడమే లేదు.

ఇం—(Taking up the book again) "వేయికన్నుల వేల్పుతో విగ్రహించి" 'విగ్రహించి'-అంటే జ్ఞాపకం వచ్చింది-నా బొమ్మ రాయవూ.

మ—'విగ్రహించి' అంటే బొమ్మసంగతి కాదు ఇందిరా!
[ఇంటిలోనుంచి పిలుపు—'రండి లేచి - వేళయింది.']
అమ్మ పిలుస్తూంది - వెళ్లు - నేను పుస్తకాలు సర్దేసి యిప్పుడే వస్తా.

ఇందిరా! ఒకమాట చెప్పను మఱచాను. రేపు మా కాలేజి హాలులో ఒక మీటింగుంది. ప్రొఫెసర్ బెనర్జి గారు ప్రిసైడ్ చేస్తారు - గవర్నరుగారు కూడా వస్తారట - రాధాకృష్ణ పండితుడు - ఇంకా చాలామంది ప్రముఖులు సమావేశ మౌతారు. వస్తావా.

ఇం—నీ ఉపన్యాస మేమైనా ఉందా?

మ—లేకేం—నాదే ప్రధానోపన్యాసం.

ఇం—అలాగైతే తప్పకుండా వస్తాను.

మ—మీనాన్నగార్ని కూడా పిల్చుకురావాలి.

ఇం—అవశ్యం—

("రండి - క్రిందికి దిగి మాట్లాడకూడదూ!" అని కేక.)

(Exit—Curtain)

## Scene 10

[Night—Prabhakar and Malathi on a Village Pial—A Small group of people—Lamp-light.]

మా—నాన్నా, దారీ డొంకాలేని యీ కుగ్రామాల్లో యెంత వెదకినా యేం లాభం లేదు - మనం నెమ్మదిగా మద్రాసుకు చేరుకుంటే బాగుంటుంది. కొన్నాళ్ళకైనా అన్నయ్య అక్కడ కనుపించవచ్చు. అన్ని దేశాలవాళ్లు ఒకప్పుడు కాకపోయినా మరొకప్పుడు అటువంటి గొప్ప పట్టణాలకు తప్పక వస్తారు - కాబట్టి—

ప్ర—అలాగేలే అమ్మాయ్ - అక్కడికి రేపే బయల్దేరుదాం— నాకు మనస్సు నిండా కలవరంగా వుంది. మన పెట్టెతీసి భాస్కరరామాయణం పట్టుకొచ్చి నాలుగు పద్యాలు చదువు - కొంతైనా విశ్రాంతి కలుగుతుంది.

మా—(పుస్తకం తెచ్చి - దీపం హెచ్చించి - చదువుటకు సిద్ధ పడును-) ఏ పట్టు చదవమంటారు నాన్నా?

ప్ర—ఏపట్టు అయితే నేం - అమ్మాయ్, రామాయణం - 'మధురం - మధురాక్షరం' - అన్నారు. చక్కెర చిలకలో ఎక్కడ విరిచి తిన్నా తీపే అన్నట్లు - రామాయణంలో యేమూల చదివినా మధురంగానే ఉంటుంది.

మా—అవును నాన్నా. ఆ మాట నిజం - [ఒక వీన పుల్లతీసి పుటలలో గుచ్చి ఒక పుటతీసి చదువును.]

"ఓ పట్టీ, నను డించి నీ వరిగెదే,
యుగ్రాటవీ వాటికిన్
నాపుణ్యం బిటు లయ్యెనే, వినఁగదే,
నాకేది దిక్కంచు నా
భూపాలుం డతి దుస్తరవ్యథఁ బడన్
బోకున్ గళద్బాష్పుఁ డై,
చూ పాదిక్కున దవ్వుగాఁగ నెసఁ
గించున్ దూలు దైన్యంబునన్."

ప్ర—(Shedding tears as the verse is read) మంచి ఘట్టమే వచ్చింది.

మా—(కళ్లనీళ్లతో) ఇది వొద్దు నాన్నగారూ - మరొకటి చదువుతాను.

ఒకడు—మొదలెట్టింది విడవకండి బాబు!

మరొకడు—యేమిటి బాబూ? అర్థం చెప్పండి.

ప్ర—అలాగే నాయనా, వినండి -

(గొంతు సవరించుకొనుచు - దుఃఖాన్ని మింగుతూ) శ్రీరామచంద్రమూర్తి ఉన్నాడే - దశరథ చక్రవర్తి కుమారుడు - అడవి కెళ్లాడని - దశరథుఁడు నిండా తల్లడిల్లి - తహతహాపడిపోతున్నాడు. కండ్ల నీళ్లు ధారా పాతములుగా ప్రవాహాలై పారుతున్నాయట-రాముడి రథం వెళ్లినవైపే - దృష్టి నిలిపి - దుఃఖిస్తున్నాఁడట - సుగుణాభిరాముడు తన ముద్దుకుమారుడు-రామచంద్ర

మూర్తి - ఘోరారణ్యములపాలైనాడని ఆక్రోశించి అవస్థపడుతున్నాడు.

ఒకడు—బాబూ, ఇంత దుఃఖపడుతూవుండే తండ్రిని విడిచి పెట్టి పోవడం ధర్మమే అంటారా?

ప్రభా—నాయనా ఆ సంగతి ఆ భగవంతుడికే తెలియాలి—
స్వామీ, రామచంద్రమూర్తీ! ఇల్లాచేయడం యేం న్యాయం? నీకోసం నీముసలితండ్రి 'రామా రామా' అని ఆక్రందించి అటమటించి పోతుంటే దిగవిడిచి ఆయన చావుక్కూడా దగ్గర లేకుండా దేశాంతరం వెళ్లావుగా! యెంత మహానుభావుడవయ్యా! నీతో మొరపెట్టుకొని యేమీ లాభంలేదు. నీతండ్రికే యీలా చేసినప్పుడు నీవు నాకా మేలు చేయబోతు న్నావు?
నాయనా, - మనోహరం! "నాన్నా, చెల్లీ" అంటూ యెంత ప్రేమచూపేవాడివి; యెక్కడున్నావు తండ్రీ, నీవున్నూ ఆ శ్రీరాముడి తరగతిలో చేరినవాడవే. మీ ప్రేమలు మాకు బోధపడవు - ఈ విచిత్రప్రణయాలు యెచ్చట నేర్చుకొన్నారయ్యా!
అబ్బా, అబ్బ - మనోహరం - యెంత అన్యాయం - అయ్యో, ఒక్కమాటుకూడా కనిపించవూ-నాయనా, రావూ, నా అపరాధం క్షమించవూ, రామా, ఆపద్బాంధవా - రావూ-(మూర్ఛిల్లును)

(మాలతి - కన్నీళ్లు - ఉపచారాలు.)

(Curtain.)

## Scene 11

[Subba Row's garden gate - Enter Subba Row from inside the house and Indira from outside.]

సుబ్బా—అమ్మాయ్ - ఇంత ఆలస్య మైందేం? మీటింగు అయిందా?

ఇంది—నీవు వస్తానంటివే, రాలేదేం నాన్నా?

సుబ్బా—అవసరంగా ఒక పెద్దమనిషితో పనుండి వెళ్లానమ్మా. బాగా జరిగిందా మీటింగు?

ఇంది—బాగా యేమిటి ? మహా అద్భుతంగా జరిగింది. అల్లాంటి మీటింగు మళ్లా యీజన్మంలో చూస్తామా!

సు—ఆ ! ఆంత బాగుందిగా!

ఇంది—మామయ్య యీనాడు - మహాగౌరవం - విఖ్యాతి సంపాదించాడు.

సు—ఉపన్యాసం అంత బాగా వున్నదన్న మాట.

ఇం—అది ఉపన్యాసమా - ఆకాశగంగాతరంగాలవిలాసమే అని చెప్పాలి.

సు—అలాగా?

ఇం—ఆ భావపరంపరలు - ఆ పదజాలముల లాలిత్యములు - ఆ వచనరచనావిన్యాసములు - విని కొమ్ములుతిరిగిన ప్రొఫెసర్లంతా తలలూంచారు—రాధాకృష్ణపండితు డంతవాడు ముగ్ధుడై పొయ్యాడు - ఉపన్యాసం కాగానే మామయ్యను అట్టే కౌగలించుకొని "తెలుగు

జాతిప్రతిష్ఠకు విజయధ్వజం మరల నిల్వద్రొక్కినావురా బాబూ చిన్నవాడవైనా" అని శ్లాఘించాడు.

సు—నీవే యింతబాగా మాట్లాడగల్గివున్నావుగదా - మీ మామయ్యసంగతి చెప్పాలి. మీటింగుకు నేను రాలేక పోవడం నా దురదృష్టమే - మీ మామయ్య యేడీ?

ఇం—రామకృష్ణపరమహంసగారి పతానికి బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంటే అందులో వున్నాడు—నా ఆనందం పట్టలేక మీకు చెప్పాలని నేను ముందుగా వచ్చేశాను. మామయ్యకూడా వస్తూనే వుంటాడు. నేను యెదురుగా వెళ్లి కలుసుకుంటాను. మీ రెక్కడికి వెళుతున్నారు?

సు—ఒక స్నేహితునితో మాట్లాడివస్తాను. (రెండుమూడడుగులు వైచి)—వెలలేని రత్నం దొరికింది - ఆరాఘువదా సన్నట్లు నన్నుద్ధరించటానికే ఇతణ్ణి భగవంతుడు నాకు ప్రసాదించాడు. అన్నిటికీ మా యిందిరమ్మ సుకృతమే అని చెప్పాలి—ఇతనికీ ఆమెకూ మూడుముళ్లూ పడి ఒక మగబిడ్డ కలిగితే చూచి ఆనందిస్తామని ఉవ్విళ్లూరుతున్నది మా ఆవిడ. ఆ కోరిక ఎప్పుడు ఫలిస్తుందో!

(Exit)

[Indira moves in the opposite direction and is met by Manohar after she takes a few steps.]

ఇం—మామయ్యా, నీ వుపన్యాసానికి నాహృదయపూర్వక అభినందనాలు. నీకు గొప్ప గౌరవం వచ్చింది - నీ మూలాన మాకందరికీనీ.

మ—అంతా ఆవిశ్వేశ్వరుడి కరుణావిశేషం - మీా తల్లిదండ్రుల ఆశీర్వాదం.

ఇం—అంతా నీ అదృష్టమే.

మ—నా అదృష్టం యేముంది ఇందిరా, నీలాంటిదాని సాహచర్యం లేకపోతే? నీ సాహచర్యంచేతనే నేను అదృష్టశాలినయ్యాను.

ఇం—అలాగా (మందహాసంతో మనోహరుని చెక్కిలి తర్జనితో నిమురును. అతని శరీరం పులకరించును.)

మామయ్యా, యిప్పుడే చంద్రోదయమయింది - యీనాడు నిండుపున్నమ - యెలాగుందో చూడు. (ప్రేమావలోకనముతో) ఆ నైట్ క్వీన్ గుబురువద్దకివెళ్లి కూచుందాం రా.

(Both sit on the sands)

యీప్రసవాల పరిమళమంతా మనదేనా యీనాడు? అదిగో అక్కడవుండే ఆసంపంగిలీగెలవద్దకి వెళ్లి పూలు కోసుకొస్తా క్షణంలో— పోనా?

మ—ఇక్కడున్నట్టు రావాలి.

(ఇందిర హాాయలుగా పరువెత్తిపోవును.)

(మనోహరుఁడు కోయిలకూత వినును)—యీా కోయిల కంఠానికి యెంత మాధుర్యాన్నిచ్చాడు - నాకుకూడా పాడాలనిపిస్తున్నది—

Song.

యీ మలయమారుతమూ - యీ సుధాంశుకిరణాలు ఎంత ఆనందజనకంగా ఉన్నవి-యీనాడు ఇందిర రూపు యెంత సుందరంగా ఉంది! ఆమె నా కన్నులలో నేడు ప్రసరింపజేసినచూపులు నా హృదయంలో ఒక దివ్యజ్యోతిని వెలిగించాయి.

[ఇందిర దారితప్పించి - సవ్వడిచేయక మనోహరుని వెనుక నిలిచి అతని కనులు మూయును.]

మ—గాఢాంధకారంచేశావు - పట్టువిడిపించు.

ఇం—దివ్యజ్యోతి వెలిగిందన్నావు అంధకారం ఇంకెక్కడిది?

మ—అవును. లేదు.

ఇం—నిజమేనా?

మ—ముమ్మాటికీ.

ఇం—అయితే విడిపించా యీ చిలుకను నీ బాహుపంజరంలో.

(Embrace)

మ—నా అదృష్టమే అదృష్టం -

ఇం—నా ఆనందమే ఆనందం.

(A duet Curtain)

---

## Scene 12

[Prabhakar in sick-bed at Madras in a temporary lodge near Madhava Row's Nursing Home.

మాలతి—(దిగులు ముఖంతో) నాన్నా, యెలావుంది? కొంచెంగా ఆహారం పుచ్చుకుంటారా.

ప్రభా—అక్కర్లేదు అమ్మాయ్ మాలతీ, యిలారా,—నా వైపు తిరుగు - పదిరోజు లైంది నే పడకపెట్టి - యెలా నెగ్గిస్తున్నావో,—ఒక్కపూటైనా కంటినిండా నిద్ర యెఱుగవు. యెంత చిక్కిపొయ్యావు.

మా—నాన్నా, నన్ను గురించి మీరేం దిగులుపడకండి-దేవుని దయవల్ల మీకీ జబ్బు నిమ్మళిస్తే,

ప్ర—పిచ్చితల్లివి - ఇది నిమ్మళించే జబ్బుకాదు. మాలతీ, నీకింకెవ్వరు దిక్కు - నీ జీవితాన్నంతా పాడుచేశాను.—నాకు మతిచెడిపోయింది - (మాలతి కన్నీరు నించును) యేడవకమ్మా - యేడవకు - యీ తీరనిదుఃఖంతప్ప నీకు మరేమీ యియ్యలేకపోయాను—నిన్ను ఒకడి చేతిలో పెట్టివుంటే కొంతైనా శాంతివుండేది.—నాకేం శాంతి, మనోహరం! తండ్రీ - యెక్కడెక్కడ తిరిగి యెన్నెన్ని బాధలు పడుతూవున్నావో—ఒక్కమారు కనపడవూ - కలలోనైనా— (దగ్గును)

అమ్మాయీ (ఆయాసముతో) - ఆయాసము - అమ్మయ్యో: బాధ - భరించలేను తల్లీ.

మా—ప్రక్కన్నే చికిత్సశాలుంది—ఇప్పుడే వస్తాను డాక్టరును తీసుకొని.

ప్ర—యెందుకమ్మా - డాక్టర్లు - ఉపయోగంలేదు - యీపూట గడవదు. భగవంతుడు నీకైనా ఒకదారి చూపిస్తాడో—

అబ్బా! బాధ - (Holding his heart)

మా—నాన్నా - నే వెళ్లొస్తాను.
ప్ర—నీ వొంట్లో శక్తిలేదు—వొద్దు.
మా—ఇప్పుడే వస్తాను—(She runs—Curtain.)

---

## Scene 12 (b)

[Malathi comes running to the Hospital Gate]

మాలతి—యీవీధి చివరన - మాతండ్రి—

[She falls and sustains an injury on the head. Madhava Row and Kamalam come out.]

మాధవ—కమలం - లోపలికి పట్టించుకొని వెళ్లు—నేను వీధి చివరి కెళ్లొస్తాను.

(Curtain)

---

## Scene 12 (c)

[Doctor Madhava Row at Prabhakar's sick-bed—feels the pulse and heart - finds him dead and asks the volunteers to remove the body.]

---

## Scene 13

[Nursing Home—Nurse Susila attending on Malathi—Dr. Madhava Row at the bed-side.]

మాధవరావు—టెంపరేచర్ తీశావా? నర్స్! జాగ్రత్తగా నోట్ చేయ్! ఐస్ వుందా, యేదీ చార్టు యిలాతే.

[He takes the chart from the Nurse, examines it and becomes thoughtful. Kamalam enters, goes from behind and looks into the chart over the shoulders of Madhava Row.]

కమలం—మధూ!

మా—(ఉలిక్కిపడును)

క—యేమి టలా తెల్లబోయి చూస్తున్నావ్.

మా—కమలం, యీజబ్బు నాకేం బోధపట్టం లేదు.

క—నీదా, ఆవిడదా?

మా—నాదేమిటి?

క—నీముఖం అద్దంలో చూచుకో - పేషంటు కంటె అన్యాయంగా వున్నావ్. డాక్టర్లు యిలా నిరుత్సాహపడితే - మరి రోగుల గతేమిటి?

మా—అది కాదు కమలం - మనకు తెలిసిన మందులన్నీ వాడినాము. ఇంజెక్షన్లు కూడా యిచ్చాము. వారంరోజులైనా యింతవరకు స్మృతిరాలేదే - స్పెషలిస్టు నాగరాజుగారిని పిలుద్దామా అనుకుంటున్నా.

క—నాగరాజుగారే! యెంతపుచ్చుకుంటాడో తెలుసునా?

మా—మన రిజర్వు లోనుంచి యిచ్చేదాం.

క—(Astonished) యెవరావిడ?

మా—నీకెంతో నాకూ అంతే తెలుసును. కేసును గురించే కాని—

క—అలాగా?

మా—మరేమీ లేదు-

సుశీల—అమ్మగారు కండ్లు తెరిచారండీ.

[Madhava Row and Kamalam go to the patient. Madhava Row looks at her.]

మాల—నాన్నా !

మాధ—అమ్మాయ్. పడుకో—

(Turning to Kamalam)

కమలం !

క—గండం గడిచింది - మరి నీవు వెళ్లి విశ్రాంతి పుచ్చుకో.

మాధ—అలాగే కాని—నీవు యిక్కడే వుండి జాగ్రత్తగా కనిపెట్టివుండు.

క—(Smiling) చిత్తం, మధూ—నీ వీకేసులో పెర్సనల్ ఇంటరెస్టు తీసుకుంటున్నావ్.

మాధ—ప్రతికేసులో అలాగేకా - (Exit Madhava Row)

(Curtain.)

---

## Scene 14

[Malathi convalescent—Kamalam by her side.]

కమ—ఎలావుంది మీకు ?

మాల—హాయిగా ఉంది—బాధేమి లేదు -

కమ—రాత్రిళ్లు బాగా నిద్రపటుతుందా?

మాల—చక్కగా,—చెప్పరూ, మా నాన్నగా రెప్పుడు వస్తారు? స్వగ్రామానికి వెళ్లాడని చెప్పారుగా డాక్టరు గారు.

కమ—(Hesitantly) వస్తారు—ఆసంగ తెందుకు లెండి. ఈ రూములో సౌకర్యంగా ఉందా? లేక ఇంకొక గదికి మార్పించమంటూరా?

మాల—అవసరం లేదండి - చాలా అనుకూలంగా ఉంది ఈ గది. ఇక్కడికి మంచిగాలి వస్తుంది—కమలమ్మగారూ, ఎన్నాళ్లైంది మానాన్నగారు ఊరికెళ్లి? డాక్టరుగారి అడ్రెసుకు ఉత్తర మేమైనా వ్రాశారా?

కమ—మీ నాన్నగారివిషయం అట్టే బెంగపెట్టుకోకండి.

మాల—ఏం అలా అంటారు?

కమ—ఏమీ లేదు. ఒకరికోసం మరొకరు తాపత్రయపడితే లాభం లేదంటాను.

మాల—ఒకరికోసం కాదండి - మానాన్నగారికోసం.

కమ—(Slowly) అవును. మీ నాన్నగారు జబ్బుగా ఉండ లేదూ?

మాల—(Recollects) అవునండి - వారికి చాలా జబ్బుచేసింది —నయం కాలేదూ?

కమ—లేదు—పాపం -

మాల—అయ్యో!! నాన్నా—(Shrieks and falls on the bed)

కమలం—(Comforts her) అధైర్యపడకండి—ప్రాణాలు శాశ్వతాలా? ఇల్లా మీరు దుఃఖిస్తే, ఏం ప్రయోజనం?

మాల—నాన్నా నాన్నా,—అభాగ్యురాలిని—అయ్యో!

కమ—అమ్మా, దుఃఖించకండి. మేము పడ్డ శ్రమంతా వ్యర్థం చేయకండి. నామాట కొంచెం వినండి-ఒళ్లు మనస్సు - ఆయాసపెట్టుకోకండి, నామాట వినరూ?

మాల—కమలమ్మగారూ - ఏంచేయమంటారు? కన్నతండ్రి కావటంచేత నిలుపుకోలేకుండా వున్నాను.

కమ—డాక్టరుగారు వచ్చేవేళయింది. మీచికిత్సవిషయంగా ఆయన యెన్నిపాట్లు పడ్డారు పాపం - అందుకైనా - మీరు హృదయాన్ని శాంతపఱచుకోండి - కలవరపడకండి - సరేనా?

(Exit)

(Enter Dr. Madhav)

మాధ—కులాసాగా ఉందా?

మాల—తమదయవల్ల ఒళ్లు నిమ్మళమైంది - మీకు ఎంతో శ్రమకల్గించాను - మీఋణం ఎలా తీర్చుకుంటానో! మాతండ్రి అగ్నికార్యాలుకూడా మీచేత చేయించాను.

మాధ—నాఋణం ఇదివఱకే తీర్చేశావు - బ్రతకడంవల్ల.

మాల—అలా అయితే నేను ధన్యురాలనే! ఎక్కడా, ఏ దిక్కూ లేని నాయందు మీరు చూపినశ్రద్ధ ఫలించిందని

సంతోషమే—కాని నన్ను బ్రదికించడంవల్ల మీరు నాకు అపకారమే చేశారో యేమో! మరేం అనుకో కండేం!

మాధ—ఇంత చిన్నవయస్సులోనే బ్రదుకుమీద విరక్తికలిగింది - ఏమో?

మాల—మీకు వినిపించి, మీమనస్సుకు బాధకలిగించటం నాకేమీ యిష్టంలేదు - క్షమించండి. నాకు సెలవైతే, నేను ఎక్కడికైనా వెళ్లి—

మాధ—ఎక్కడికి వెళ్తావ్? మీవాళ్లు ఎవరైనా ఉన్నారా?

మాల—నాకు ప్రాణదానంచేసిన మిమ్మల్ని తిరస్కరించాననే అపకీర్తి నాకు రాకుండా - నన్ను కాపాడండి-నాకనుజ్ఞ ఇవ్వండి. మీపాదాలకు మ్రొక్కి వేడుకుంటాను.

మాధ—ఇప్పుడేగా నీవు కొంచెం లేచి కూర్చోవడం. ఇట్టి స్థితిలో వుండే నిన్ను - ఇప్పుడు ఒంటరిగా వదిలేయమంటావా, కొన్నాళ్లు జరగనీ చూద్దాం.

మాల—ఎన్నాళ్లు?

మాధ—ముందు ఎలా తెలుస్తుంది?

మాల—అలాగే కానీయండి.

మాధ—వెళ్లి రానా?

(స్నేహావలోకనము ప్రసరింపఁజేయుచు-నిష్క్రమించును.)

(Curtain.)

---

## Scene 15

(SubbaRow's House in Benares Indira and Manohar.)

మనో—ఇందిరా - ఇందిరా.

ఇం—యేమి టాతొందర? యీగది సర్దేసి రాకూడదూ?

మనో—ఇందిరా - ఒకమాట.

ఇం—ఆ మాటేమిటో వేగిరం చెబ్దూ మామయ్యా - నాకు బోలెడు పనుంది.

మనో—ఏమిూ అనోకేకేం!

ఇం—సరిపోయింది - యీమాటకేనా అన్ని కేకలూను?

మనో—కాదు ఇందిరా.

ఇం—కాదు యిందిరా యేమిటి, నేను యిందిరను కానూ - యీ సరసం బాగుంది అన్నిటికంటేనూ.

మనో—నీతో...

ఇం—యిప్పుడు నాకు తొందరపనుంది - తర్వాత తీరుబడిగా కూర్చుందాం! యీలోపున మీరు చెప్పదలచుకొన్న దేమిటో ఒకకాగితంమిూదైనా వ్రాసిపెట్టుకోండి.

మనో—ఏమిూలేదు.

ఇం—యేమన్నావుంటే యిందాకటినించి బయటరాదూ?

మనో—నీతో బలేతంటాగా వుంది.

ఇం—యేంజేశాను నేను.—నాపని నేను చూచుకుంటూవుంటే నన్ను పిలిచి—

మనో—(Makes up his mind)యీరోజున రాధాకృష్ణ గారివద్దకు వెళ్లాను.

ఇం—మంచిపనేగా.

మనో—మద్రాసులో డాక్టరు మాధవరావుగారి చికిత్సాలయం వుందట - అక్కడికి సూపరెంటెండెంటుగా వెళ్తావా? అని వారు నన్ను అడిగారు.

ఇం—యేంజెప్పావు మామయ్యా?

మనో—దేశం విడిచిపెట్టివచ్చి చాలా రోజులయింది—వెళ్దామా అనివుంది.

ఇం—అక్కడ మీవాళ్లెవరైనా ఉన్నారా?

మనో—ఆరోజున చిత్తరువును చూచి 'యెవరీవిడ ?' అని అడిగావు జ్ఞాపకంవుందా ?

ఇం—(Dejected)—వుంది—ఆ!

మనో—ఆవిడ మాచెల్లి - మాలతి.

ఇం—మాతో చెప్పలేదేం మామయ్యా, యేవూళ్లో వుంది?

మనో—యెక్కడుందో తెలియదు - మావూరికి ఉత్తరం వ్రాస్తే వాళ్లసంగతి యేమీ తెలియదని జవాబు వచ్చింది.

ఇం—పాపం, (Fondling him) వెళతావా.

మనో—(Slowly) 'నిన్ను - యెలా వదిలివెళ్లడం' - అని ఆలోచిస్తున్నా.

ఇం—నేనూ కూడావస్తాను - మా అమ్మతో చెప్పి.

మనో—ఇందిరా - నేను వెళ్లి, మా మాలతిసంగతి కనుక్కొని, త్వరలో నేవచ్చి, మీ అమ్మా నాన్నతో చెప్పి, నిన్ను తీసుకొని వెళ్తాను.

ఇం—మామయ్యా! (She gets into his arms)

(Curtain)

---

## Scene 16

(Enter Nursing Home Miss Kamalam and Dr. Madhav.)

మాధవ—చూడు - సూపరెంటెండెంటు పనికి అప్లికేషన్లేమైనా వచ్చాయా.

కమలం—(Picking out one letter) మధూ, కంగ్రాట్యులేషన్స్!

మాధవ—ఏమిటి కమలం ?

కమలం—రాధాకృష్ణగారు రెకమెండ్ చేసిపంపారు-మనోహరావట, ఆంధ్రుడట, కాశీలో సోషాలజీలో కాలేజిలో ఫస్టుగా ప్యాసయ్యాడట—చాలా యెక్కువగా శ్లాఘిస్తూ వ్రాశారు.

మాధ—ఇలాగియ్ (Reads) వెరి గుడ్! వీలైనంత వేగిరం చార్జిపుచ్చుకొమ్మని వ్రాశేయ్.

కమలం—సరే - అలాగే రాస్తాను. కానీ - (Smiling) మధూ! మరేమీ అనుకోకేం - నీ వేమిటి ఇల్లా అయిపోయావ్? ఈ మాలతిమూలాన నీస్వభావమే మారిపోయింది.

కమిటీ మీటింగులకు రావడంకూడా ముగించావు —
నీతీరు నాకేమీ బోధపట్టంలేదు. నీకేమైనా ఒళ్లు సుస్తీగా ఉంటే చెప్పేయరాదూ. తగిన ట్రీట్ మెంటు ప్రయత్నం చేస్తాము.

మాధ—నాకేమీ జబ్బులేదు కమలం-అన్నంకూడా బాగానే తింటున్నాను. కాని—యీ మాలతి—

కమలం—ఏం మాలతికి? జబ్బుకూడా పూర్తిగా నిమ్మళించిందిగా?

మాధ—"నే నెక్కడికైనా వెళ్తాను. నాకు సెలవిప్పించండి" అని అడిగింది.

కమ—నీ సెలవేమిటి? వెళ్లేలావుంటే వెళ్లకూడదూ? రావటానికి ఎవరిచ్చారు దీనికి సెలవు?

మాధ—తండ్రిగూడా చనిపోయాడుగదా. ఎక్కడికెళ్తుంది పాపం?

కమ—ఎక్కడికో! దానియిష్టం వచ్చినచోటికి. ఆ గొడవంతా మనకెందుకు?—అయినా అడగలేకపోయావూ?

మాధ—అడిగాను.

కమ—ఏమంది?

మాధ—"నాగొడవ మీకెందుకు వినిపించడం - మిమ్మల్నెందుకు ఏడిపించడం. దయచేసి నన్నేమీ అడక్కండి" అంది.

కమ—అన్నదీ ఆమాట? అయినాయీ మంగళహారతులు? బాగుంది - అలావుండాలి.—సరే, ఈరోజు స్పెషల్ మీటింగ్ కైనా వస్తావా మత్తీ?

మాధ—అన్నట్టు మఱచేపోయాను. కమలం!—ఆ మీటింగ్ నీవు కండక్ట్ చేయకూడదూ! ఒంట్లో నా కిప్పుడేమీ కులాసాగా లేదు.

కమలం—(Smilingly) ఇప్పుడడిగితే, 'కులాసాగా ఉన్నా దన్నావు. మీటింగ్ కు రమ్మంటే సుస్తీగా ఉందంటు న్నావు. ఏమిటీ నీసంగతి? ఇలారా, (శరీరం స్పృశించి) ఒళ్లేం యింత వేడిగా ఉంది (Feels the pulse) - పల్స్ ఇంత వడిగా ఉందేం? థర్మామిటర్ నోట్లోవుంచుకో (Sees the temperature and finds it normal) (కొంచె మాలోచించి నవ్వుచు) మధూ నీకు వొంట్లో సుస్తిగా ఉంది. మీటింగ్ నేనే జరుపుతాను. నీ వింటి దగ్గరే ఉండిపో.

మాధ—కమలం, ఎంతుంది టెంపరేచర్ ?

కమలం—(నవ్వుచు) మధూ, ఈజ్వరం, నీపూ నేనూ చదివిన పుస్తకాలలోదికాదోయ్, దీనికి పేరు వేఱే వుంది.

(Both Exit—Curtain)

---

## Scene 17

[Near the Nursing Home.
Enter Miss Kamalam and Madhava Row from opposite sides—Madhava Row holds a book in his hand.]

కమలం—మధూ, ఏమి టా గ్రంథం? ఇలా యీ! ఎక్కడి దది?

మాధ—ఇదా, సభనుంచి పట్టుకొచ్చాను.

కమ—నాటకమా యేమిటి? రిహార్సల్‌నుంచా? (Snatches the book from him, looks at it and reads the title) "మాలతీమాధవం"—ఊహూ!! (Nods her head) ఈ నాటకమేనా యిప్పుడాడడం? పోర్షన్ చక్కగా చేయ్—సరేనా? (Laughs) (Exit)

[Madhav enters the Nursing Home and gets into the chamber of Malathi.]

మాధ—ఒళ్లు నింపాదిగా ఉందా?

మాల—కులాసాగా ఉంది.

మాధ—అయినా యేదీ, చెయ్యిలాతే!!

మాల—అవసరం లేదండి - హాయిగా ఉంది.

మాధ—మాలతీ, నీకేమీ ప్రొద్దుపోవడంలేదని ఈపుస్తకం పట్టుకొచ్చాను చూడు.

మాల—ఏమిటది? (చేతికితీసుకొని) "మాలతీ—"

మాధ—ఏమక్కడే నిలిపేశావ్?

[మాలతి తలవ్రాల్చి, ఒక కన్నీటిబిందువు రాల్చును.]

ఏమిటది మాలతీ! ఎందుకూ? (కన్నీరు తుడుచును)

లోపలినుండి పిలుపు "మధూ!" అని ధ్వని.

మాధ—ఇదిగో వస్తున్నాను.

(Exit—Curtain.)

---

## Scene 18

[Mid-night Malathi's chamber.]

మాలతి—ఎంతవిపరీతం! నా స్థితేమిటి? నా మనస్సును కలవర పెట్టే యీతుపానేమిటి?—ఒక్కక్షణంకూడా ఉండకూడదు—

నన్ను పట్టినదేవతే ఆయన్నుకూడా పట్టింది - సందేహంలేదు. ఆయన సెలవుకి కనిపెట్టుకొని ఉంటే మఱి నాకు మోక్షం ఉండదు—

—అందఱూ గాఢనిద్రలో ఉన్నారు - ఇదే మంచి తరుణం - పోవలసిందేనా? గత్యంతరం లేదు. మఱొక్కక్షణమైనా ఇక్కడ ఉండకూడదు.—

[Slowly proceeds, opens the door and goes out. Madhava Row suddenly appears behind her and holds her hand]

మాధ—మాలతీ!

ఈ అర్ధరాత్రంలో ఎక్కడికి బయల్దేరావు? ఒంటరిగా - నామీద కోపం వచ్చిందా-మరేమీ అనను లే! లోపలికి దా, ఇంక నీ వూసెత్తితే ఒట్టు.

(Malathi slowly leans into his arms.)

మాల—(డగ్గుత్తికతో) మీరు నిద్రపోయ్యా రనుకున్నాను.

మాధ—నాకు నిద్రపట్టిందా? మాలతీ - అర్థంకావటం లేదూ! నీ ఒక్కమాటమీద ఉంది.

మాల—నా మాటేముంది - అంతా మీదేకాదూ.

(Curtain)

---

## Scene 19

[Madhav Row's House in his native place—
Enter Madhav, his mother and Malathi.]

సీ—మాలతీ, యిన్నాళ్లకి నాకోరిక ఫలించింది - దేవుడి దయ వల్ల వచ్చే యీరోజులకి—

మా—(సిగ్గుతో తలవంచుకొనును.)

సీ—అమ్మాయ్, నే ననటంకాదు గాని, నీవు అదృష్టవంతురాలవి - మాధవుడు చాలా యెక్కువైనవాడు. నీవూ వాడికి అనుకూలవతివి లభించావు. అయినా—పెద్దదాన్ని గనుక చెప్పవలసినమాట చెప్తున్నాను. మగవాళ్లు పదిమందితో తిరిగేవాళ్లు. కాబట్టి ఒకప్పుడున్నట్టు మరొకప్పుడుండరు. వాళ్లననుసరించి వారి మనస్సును

గుర్తెరిగి జాగ్రత్తగా మెలగాలి సుమా! ఈసంగతులు నీకు తెలియనివికావు అయినా—

మా—అమ్మా, నాకు తల్లి అయినా అత్తఅయినా అంతా మీరేగా! (కన్నీరు నించును.)

సీ—మాధవా, తల్లిదండ్రులు లేని బిడ్డ ఎలా యేలుకుంటావో! నాయనా, నీవై తెచ్చుకున్నా నాకు నచ్చిన కోడలే వచ్చింది.

("బాబూ, సామాన్లన్నీ బండ్ల కెత్తించాము" అని లోపలినుండి ధ్వని)

మాధ—అమ్మా వెళ్లొస్తాము -

(మాలతీమాధవులు నమస్కరింతురు.)

(Curtain.)

---

## Scene 20

[Madras—Dr. Madhav Row's house. Enter Malathi and Madhav.]

మాధ—మాలతీ.

మాల—ఊఁ, ఏమండీ, పిలిచారు?

మాధ—'ఏమండీ' 'ఏమండీ' అనకపోతే నాకు పేరులేదూ?

మాల—భిన్నభావాలుండే వ్యక్తులైతే పేర్లుపెట్టి పిలుచుకోవాలి.

మాధ—ఈ అద్వైతాన్ని యెక్కడ చదివావు?

మాల—గోవిందుని ప్రేమగీతలో.

మాధ—మాధవుని ప్రేమగీతలో అద్వైత మంటే యేమో తెలుసునా?. (Embraces)

మాల—మా అత్తగారిని ఇక్కడికొచ్చి పదిరోజు లుండమన గూడదూ?

మాధ—నన్ను దండించటానికా?

మాల—ఎప్పుడూ హాస్యమేనా?

మాధ—మాలతీ, మొన్న టీపార్టీకి నీవు రాలేదేమని మా స్నేహితులందఱూ అడిగారు - 'గోషా ఉందా ఏమిటీ?' అని వేళాకోళం చేశారు.

మాల—మీ రేమన్నారు?

మాధ—ఏమీ తోచక 'ఈ మారొస్తుం' దని చెప్పాను.

మాల—అలా యెందుకన్నారు? "నాభార్య పాతకాలపుమనిషి దానికీ యీటీపార్టీలకీ చాలాదూరం" అని చెప్పక పోయ్యారా?

మాధ—పాతకాలం అంటే జ్ఞాపకం వచ్చింది. ఏదీ పాతకాలపు పాటొకటి పాడు—మంచి కీర్తన - విని చాలాకాల మయింది—

మాల—ఇప్పుడే పాడమన్నారా?

మాధ—ఏం పాడకూడదూ?

(Malathi Sings)

మాధ—భేష్, చాలా బాగా వుంది.

మాల—భేష్ అన్నట్టుకాదు. ఇప్పుడొకపాట మీరు-పాడాలి.

మాధ—(Laughs) నేనా? నాకేం పాటలొచ్చు మాలతీ!

మాల—పోనీ లెండి—ఆకమలానికే వినిపించండి - మీరు నాటకాల్లో వేషాలేస్తారనీ ఎంతో చక్కగా పాడతారనీ ఎందుకు చెప్పింది మరి?

మాధ—ఆకమలం క్షణమైనా వూరుకోదు. ఎప్పుడూ ఏదో ఒక అల్లరి.

మాల—పాపం, ఎందు కావిడను ఆడిపోసుకోవడం - మీరు పాడకపోతే పూనేరు లెండి.

మాధ—మాలతీ, నాకు నాటకాలపాటలుతప్ప మరేమీ రావు నవ్వకుండా వుంటావా?

మాల—పాడండి చూదాం!

[లోపలినుండి-"మధూ!! మాధవ్" అను పిలుపు.]

మాధ—వచ్చిందిరా బాబూ, పానకంలో పుడకలాగా-

కమలం—మాధవరావుగారూ, ఏమండోయ్!

మాధ—కమలం, ఏమిటలా, వీథిలోనుంచి కేక లేదుతున్నావ్-లోపలికి రాకూడదూ?

కమ—(Peeps from outside) అన్నప్పుడల్లా రాకూడదోయ్ పూర్వంలాగు - సరేకాని-ఈ రోజు ప్రయాణం మఱచావు.

మాధ—మఱచేదేమిటి? రడీగా ఉన్నాను-ఇదో వస్తున్నా—మాలతీ, ఆసూట్ కేసిలా యియ్.

మాలతి—(Hands over the suit case) ఎప్పుడు మళ్లారాక?

మాధ—రేపు రాత్రికి.

మాల—తప్పకుండా రావాలి - వొంటరిగా ఉండలేను సుమండి.

మాధ—వెళ్లేదానా, నేనుమాత్రం ఉండగలనా?

(Exit—Curtain.)

---

## Scene 21

(At the gate of the Nursing Home.)
[Enter: Manohar with 2 Volunteers bringing luggage—Nurse Susila meets them.]

సుశీల—నమస్తే - తమ టెలిగ్రాం ఉదయం చేరింది—డాక్టరుగారు నాలుగురోజులనాడు బెజవాడకు వెళ్లారు మీరు యీరోజు వస్తారని వారికి తెలియదు.

మనోహరరావు—యేమీ పర్వాలేదు.

సుశీల—వారంరోజుల్లో వచ్చేస్తారండి - తమరికి అన్ని యేర్పాటులూ చేయించాం - మా వాలంటీరు కేశవరావు మీతోటే వుంటాడు - రేపుప్రొద్దున్నే ఆఫీసుకు వెళ్లొచ్చును.

మ—అలాగే.

[He occupies his room—arranges his things and sits in a chair—Kesava Rao is by his side. He goes in and gets a cup of coffee, which Manohar takes.]

మ—ఈ చికిత్సాలయం స్థాపించి యెన్నాళ్లైంది?

కే—మూడేండ్లు అయింది బాబూ.

మ—డాక్టరుగారు బెజవాడకు యేపనిమీద వెళ్లారు?

కే—అక్కడ ఒక బ్రాంచి ఓపన్ చేయడానికి.

మ—కొంచంసేపు షికారు వెళ్లివద్దామా?

కే—అలాగే—డాక్టరుగారి తోటవైపు వెళదాం—బాగా వుంటుంది.

[Both start out—As they enter the garden Manohar sees Malathi going into the house from the Garden.]

మ—యిలాఘ్యా_డా వుంటుందా? తీరూముఖవై ఖరి అలాగే వుంది.

కే—(Attentively) యేమిటి బాబూ?

మ—కేశవరావ్, మీ అమ్మగారిపేరేమిటి?

కే—మాలతమ్మగారండి.

మ—మీ అమ్మగారికి పెళ్లి అయి యెన్నాళ్లయింది?

కే—ఒకసంవత్సరం అయిందండి.

మ—కేశవరావ్, మీ అమ్మగారి దేవూరు?

కే—యేవూరో తెలియదండి - యిక్కడికి పేషంటుగా వచ్చి అలాగే వుండిపోయి డాక్టరు గారిని పెళ్లిచేసికున్నారండి.

మ—మీ అమ్మగారికి బంధువు లెవరూ లేరూ?

కే—యెవరూ లేరండి, తల్లి యిదివరకే చనిపోయిందట, తండ్రి యిక్కడే చనిపోయారండి—ఆమెగారికి ఒక అన్నయ్యవుంటే యెక్కడికో కనిపించకుండా వెళ్లేడట-

మ—కేశవరావ్, నీవు యింటికివెళ్లు—నే నిక్కడ కొంచెం సేపు వుండివస్తాను.

కే—చిత్తం.

[Exit Kesava Rao.]

తంఢ్రీ—అయ్యో! - నాకుగా యెంత పరితపించినావో? నన్ను చూచి సంతోషించేభాగ్యం నేను మీకు కలిగించ లేకపొయ్యాను—మీతో చెప్పకుండా నేను వెళ్లి నందుకు యిదే కాబోలు ఫలితము - చెల్లీ—ఈరోజు కైనా నిన్ను చూడడమయింది—

(Exit—Curtain.)

---

## Scene 22

[Night—Doctor Madhav Row's House—Enter Malathi and Susila.]

సుశీ—బుడబుక్కలవాళ్ల జోస్యాలు, త్రోసెయ్యదగ్గవంటా రా ?—ఎన్నటికీకాదు. మీఅన్నయ్య తప్పక వస్తాడు.

మాలతి—నీమాట నిజమైతే, నీకడుపు చల్లంగా వేయేండ్లు వర్ధిల్లాలి!

సుశీ—మీరు హాయిగా విశ్రాంతి తీసుకోండి - ప్రొద్దు పోయింది - నే వెళ్లి రానా ?

మాల—అలాగే!

(సుశీల దీపం తగ్గించి నిష్క్రమించును.)

మాల—(ఒకవైపునకు తిరిగి పండుకొని) నాకు బుద్ధి మంద గించింది. ఇంత దౌర్బల్యమేమో నాహృదయానికి? స్వామీ,

(గోపాలస్వామి చిత్రమువైపు దృష్టిసారించి)

ఎన్నడు కలుగుతుంది నాపై దయ నీకు? నిన్ను నమ్మిన వెఱ్ఱిగొల్లపిల్లల్ని తరింపజేశావుగా? నామీద నీకు దయ లేదా? ఉన్నాడా మా అన్నయ్య? రహస్యం చెప్పేయ రాదూ? అన్నిగుట్లూ నీవే దాచుకోవాలి? కృష్ణ, కృష్ణ, ఎంత మాయదారివాడవయ్యా,...

(నిట్టూర్చును)

[మనోహరుడు ప్రవేశించును. మాలతి ఉలిక్కిపడును - తటాలున లేచును - పైట సవరించుకొనును - రెండడుగులు వెనుకకు వైచును-మొగము చిట్లించుకొనును.]

మాల—ఎవరు మీరు? ఇలా వచ్చారేం? అకాలంలో! డాక్టరుగారు లేరు - వెళ్లండి మీరు - గుమ్మంలో వుండి పిలవక ఇలా వచ్చేశారేం?

మ—మీకు సుస్తిగా వుందంటే చూసి వెళ్దామని వచ్చాను.

మాల—మీ రెవర్లో తెలీడం లేదు-ఒంటరిగా ఉన్నాను - దయ చేసి వెళ్లండి.

మ—ఈ సన్నదీపం వెల్తురులో చూపు ఆనడం లేదు. దీపం కొంచెం పెద్దది చేయండి - మీకేం భయం అక్కర్లేదు - మీ తోడబుట్టినవాణ్ణే అనుకోండి.

(మాలతి దీపము హెచ్చించును. ఉద్వేగభయసంశయములతో అతని తేఱిపాఱజూచును.)

మ—నన్ను గుర్తించలేవూ మాలతీ.

మాల—వచ్చావా అన్నయ్యా! (జీవ్వున మనోహరునిపై వ్రాలును)

[They both fall in a trance. Dr. Madhava Row enters and sees them in each other's arms nods his head and comes out]

మాధ—భ్రమగప్పిందా నాకండ్లకు?...ఘోరదృశ్యం! పాపిష్ఠి కండ్లు—

మాలతీ! ఛీ, పాతకి! పేరు ఉచ్చరిస్తే నరకం -

స్త్రీజాతి! ఈ జాతి నిర్మూలం కాకపోతే ప్రపంచానికి సౌఖ్యంలేదు -

వెఱ్ఱి వెంగళప్పను నేనే! ఎంత శృంగారం, ఏమభినయిం చావే! ఆహా,—కాలసర్పాన్ని రక్షించి ఒళ్లో దాచు కొన్నాను గరళాన్ని సంజీవిగా భ్రమించి పానంచేశాను. ఎందుకు నాకీజన్మ?—

వీరిద్దరూ బ్రతికుంటే లోకానికంతా చేటు - ఈ కుల టను - వీణ్ణి, ఒకేమారు మృత్యుగహ్వారంలో విసరివేయ కుంటే నాపగతీఱదు - నాజన్మం వ్యర్థం-తుచ్ఛం-హీనం -

(Exit—Curtain.)

---

## Scene 23

[Night time—Doctor Madhava Row's House—
Enter Malathi and Manohar.]

మనో—ఏమిటిది చెల్లీ, కళ్ల నీళ్లుపెట్టుకోవడమేమిటి?—

మాలతి—మూడురోజులనాడే బయల్దేరారని ఉత్తరం వ్రాసిందిగా కమలం! ఎక్కడికెళ్లుంటారన్నయ్యా? న్యూస్ పేపర్లన్నీ చూశావా, ప్రమాదాలేమైనా—

మ—పేపర్లేమిటే? నీవెఱ్ఱిభయాలూ నీవూ, ధైర్యంగావుండు.

మాలతి—ఏంచూచి ధైర్యం తెచ్చుకోమంటావు? పడరాని కడగండ్లన్నీపడి ఈ పాటికి ఒక రేవుచేరానుగదా అనుకుంటే - అనుకున్నంతసేపైనా లేకపోయె నా ఆనందం - స్వామీ! నా అవస్థలకు అంతం లేదా! (Sheds tears)

మ—ఏమిటిది చెల్లాయ్, నీకేం భయంలేదు. ఊరుకో, ఇలా చూడు (Wipes her tears) - పడుకో తల్లీ, నిద్రపట్టించుకో... [Malathi lies and closes her eyes]

(Madhava Row enters in disguise with a knife.)

మాధ—ఏమి సరసాలు! ఏమి సల్లాపాలు! ఏడుపులు-నవ్వులు-ఓదార్పులు. అన్నిటినీ, ఇదిగో, ఈ క్షణికంలో ఊడ్చివేస్తాను.—ఇవన్నీ నా గదిలోనే? ఎంతధైర్యం! ఎంత సాహసం! చించి - చెండాడి—వీరిని భస్మంచేస్తాను.

(Aattempts to leap at them) మాలతీ! (Pause) నీవే నా ప్రాణ మనుకొంటినిగదా, నన్నెందు కిలా చేశావ్ - ఎంతో ప్రేమించాను - నీప్రేమనిలుపుకోలేక పోయాను-లోపం - నాదిగానే వుంటుంది క్షమించు—నీ ఆనందానికి అడ్డురాను. నిన్ను - కడసారి - కండ్లారా చూచి - వెళ్తాను. (Looks at the Knife) నీవు నా చేతిలో ఉంటే ఎంత ఘోరమైనా చేయిస్తావు - నా ప్రేయసి సుకుమార కంఠాన్ని ఖండింపిస్తావు - ఛీ, పో ఆవలికి! (Throws the knife away) మాలతీ !

మనోహ—ఎవరండీ మీరు ?

మాధ—అడగవలసినమాటే అడిగావు - నాయింట్లో ప్రవేశించి, నామంచాలమీద శయనించి—

మనోహ—ఛీ, ఒళ్లు పై తెలియకుండా మాట్లాడుతున్నావు. వెళ్లవతలికి !

మాధ—తమకేమీ అడ్డురాను లెండి - మా మాలతిని ఒక్కమాటు చూడనివ్వరూ? (బిగ్గఱగా) మాలతీ, మాలతీ,

మాల—(ఉలిక్కిపడి లేచును) ఏమిటిది ?

మనోహ—తప్పత్రాగివచ్చావా?

మాలతి—వీడిరూపం వీడు - వెఱ్ఱివాడులాగున్నాడు. కాళ్లూ చేతులూ కట్టివేసి కొట్లోవేసి వీణ్ణి-(Goes inside)

మనోహ—వీడెవడో గజదొంగ - (జుట్టుపట్టుకొని లాగును. ఊడివచ్చును)

(Malathi enters with a rope)

మాలతి—(తెల్లబోయి) అన్నయ్యా, మీ బావేరోయ్ ! !

(Madhav bends his head in shame)

—ఇదేమిటండీ, ఈవేషం, నిజంగా భయపడ్డాను సుమండి.

మనోహ—బావా, క్షమించు - బావగారని తెలుసుకోలేక నే నన్న మాటలు మఱచిపోండి - మన్నించండి. (చెంపలు వేసుకొనును.)

మాధ—మాలతీ, ఈనేనా మీ అన్నయ్య?

మాల—ఆ! నాలుగేండ్లనాడు ఇంటినుండి పాఱిపోయిన మహానుభావుడు ఈనే!

మాధ—ఏలాగూ!—మాలతీ, (ఏమో చెప్పబోవును)

మాల—అవన్నీ పిమ్మట చెప్పవచ్చునుగాని - ముందు మీరు వెళ్లి శుభ్రంగా స్నానంచేసివస్తే—తెల్లవారవస్తున్నది. ఈలోపల నేను కాఫీ పెట్టి యిస్తాను - కొంత బడలిక తీఱుతుంది.

మాధ—అలాగే— (Madhav Exit.)

మనోహ—ఏమిటి చెల్లీ,—చిత్రంగా ఉంది - మాబావగారి సంగతి ఊహ కందటం లేదే !

మాల—(Smiling) ఎక్కడో నాటకంలో వేషం వేసి, ఆ వేషంతోనే ఈలాగు ఇక్కడ సాక్షాత్కరించాడు. ఇంత కంటే ఏముంది? తెలిసిందా?

మ—ఆహా, ఇదా కథ! ఏమిటీ! ఇంక నే నెళ్లి పడుకుంటానే కానేపు. (Goes and sleeps)

[Malathi goes inside—Enter Madhava Row]

మాధ—మాలతీ - ఇలారా.

మాలతి—(Enters with a cup of coffee) కాఫీ పుచ్చుకోండి.

మాధ—పుచ్చుకుంటానుగాని...

మాలతి—నా కంతా అర్థమైంది లెండి - మీరేం చెప్పబని లేదు. పాపం - చాలా బాధపడ్డారు.

మాధ—మాలతీ, మహాపరాధంచేశాను—మీ అన్నయ్య ముఖం ఎలాచూచేదీ.

మాలతి—వాడికి తెలియదు లెండి.

మాధ—నా అపచారానికి ప్రాయశ్చిత్తమేమైనా ఉందా ?

మాలతి—లేకేం:

మాధ—ఏమిటది ?

మాలతి—మా అన్నయ్యకు క్రమంగా పెండ్లిచేశెయ్యండి.

మాధ—తప్పకుండాను - రేపే పిల్లను మాట్లాడే ప్రయత్నం.

మాల—పిల్ల సర్వసిద్ధంగా ఉంది.

మాధ—ఎక్కడ ?

మాల—కాశీలో

మాధ—రేపే బయల్దేరుదాం—సమస్తకల్మషాలూ నశింపజేసే గంగానదిలో స్నానం - విశ్వేశ్వరుడి దర్శనం - చేసి, మీ అన్నయ్యవివాహం జరిపించి వచ్చేశేస్తాం—సరేనా ?—

---

## Scene 24

[ఇందిరా మనోహరులు మాలతీమాధవులు మంగళముపాడుచు ప్రవేశింతురు ]

The End.



చెన్నపురి : 'శ్రీరామ' ప్రెస్సున ముద్రితము.—1942.

